సతతముఖ జించి నట్టివంశంబుమీాది
వంశమా! రాముఁడెంతున్నవాఁడె చెపుమ॥

రమణీయార్థ ప్రతిపాదకమును రసాత్మకమును పద లాలిత్యమును, నర్థగౌరవమును, నలంకారచమత్కారమును, రసానుభవసామ్రాజ్యమంద జేయఁజాలు చక్కని యుపమాన ములును, సూచించి నిరతిశయానంద సంధాయకమగు నిట్టి రసవత్కావ్యమును రచించిన కవి యెంతయు ధన్యుఁడు, కల్పనాకౌశలమున వెనుబడక నింత సరసముగ నిట్టి యశర్గళ ధారతో సర్వజనామోదముగాఁ గావ్యము వ్రాయువా రరుదు. "పుణ్యశ్లోకస్యచరితం ఉదాహరణ మర్హతి" యను ప్రకాపరుద్రీయవాక్యమంను లక్ష్యముంచి యిట్టి యుత్తమ చరితమును వ్రాసి కవిలోకమున కందఁజేసిన మనకవిగారి ధీరత్వము గొప్పది.

"గీ॥ జ్ఞానబీజంబు నాగభూషణుఁడునాటె
శాఖగాఁ బెంచె పెద్దన్న శ్రద్ధమెఱయ
నరికనకాంబచేసె దోహదముదాన
ఫలముగంటిని నాజన్మ ఫలమదంటి"

యని వ్రాసికొనిన కవిగీతమే, వారిప్రజ్ఞావైభవములకుసాక్షి. వంశమా విద్వద్వంశము. తాతతండ్రులా నిఖిలవేద వేదాంత కోవిదులు. జ్ఞానబీజమా నాగభూషణకృపావలోకనము పోష ణమా, వైద్యలోకమునఁ గవిలోకమున నుతిగన్న వీరి పెద్దన్న గారగు సుబ్బావధానిగారి హస్తప్రావీణ్యము, దోహదమా, కనకమాంబికాకృపాకటాక్షము కావ్యవస్తువా, సర్వజనాభిలాష సమాపాదకమగు భక్త తులసీదాస చరితము. కృతిపతియా.

లోకావనసమర్థుండగు శ్రీ వేంకటేశ్వరుఁడు. వ్రాయఁదలపెట్టు శ్రీనివాసచిత్రమా, భక్తిరసపరిపోషిత సరోజపేశలము, అభివృద్ధిహేతువా, త్రిలింగమహావిద్యాపీఠము. ఇఁకఁ గావ్యము శ్రావ్యముగ నుండకపోవునా, ఇంతటిమహావైభవము కవిగారి పూర్వపుణ్య ఫలమున లభించె.

ఇతోధికభక్తిరస కావ్యము లనేకము లిట్లే రచించు సామర్థ్యమునుత్సాహము చిరాయురున్నతశ్రీల నిచ్చి భగవానుఁడు మన కవిగారిని సర్వదా రక్షించుగాతయని ప్రార్థించుచు నిట్టి యుత్కృష్టకావ్యమునకు తొలిపలుకు వ్రాయు భాగ్యమును, నవకాశమును నాకుఁ గలుగఁ జేసినందులకు కృతజ్ఞతాశీర్వాదమును గవితారూపమున గానుకగాఁ బెట్టి విరమించుచున్నాను.

కం॥ శ్రీతులసీదాసుని ప్ర
ఖ్యాత మహాతత్త్వమెల్ల నద్భుతకవితా
చాతుర్య ప్రతిభఁదెలుపు
రీతిన్ వ్రాసితిగదయ్య కృతకృత్యుఁడవై.

చ॥ కలమును జేతఁబూని కవికాండము తద్దయు మెచ్చురీతి స
ల్లలితపదార్థ సౌరభ విలాసవికాస మనోజ్ఞభావముల్
పలుదెసలంటురీతి పదిలంబుగ వ్రాసెను నేర్పుకూర్పు నీ
కలవడె నాపరాత్పర మహామహిమాదరణంబునన్ సఖా!

ముద్దులుమూటఁగట్టు రసమున్ గురిపించుచుఁదక్కువ్రాతలన్
వద్దనిరద్దుసేయఁగల శక్తిని తీయదనంపుమాటలన్
దిద్దుచుఁదీర్చుచున్ మిగులఁ దేజముఁగాంచగఁ దేనెతేటలో
నద్దుచునుంటి వాకలము నాదరమొప్పఁగఁ జెప్పుమాకవీ?

మ॥ వినవింపైరమణీయమైమెసు కవితావేశంబునై యర్థగుం
భనమై భక్తులకెల్ల కల్పకమునై భవ్యంబునై జాహ్నవీ
ఘనవేగ ప్రతిమానమై లలితమై కన్పట్టు నీ కావ్యమో
యనఘా! శ్రీయుత శ్రీనివాస! కవిచంద్రా! కీర్తిశ్రేయమై.

శా॥ శ్రీలావణ్య విలాసవైభవగుణశ్రీలన్ బ్రకాశించు స
త్యాలోలాక్షి యురుక్మిణీపతియు నిత్యానందమున్ గొల్వ ని
వ్వేళన్ సత్కరుణాకటాక్షతతులన్ వేడ్కన్ బిసాళించు గో
పాలస్వామి చిరాయురున్నతులచే బ్రోచు నిన్నెప్పుడున్.

ఇట్లు
బుధజనవిధేయుఁడు

కొల్లాపురం
శ్రీ జటప్రోలుసంస్థానము
15—12—37.

వాజపేయయాజుల
రామసుబ్బారాయుఁడు
బి. ఎ. బి. ఇడి.,
స్నేహాలుకా కవితాసంఘాధ్యక్షుఁడు.



శ్రీ

# శ్రీ తులసీదాస చరిత్రము

## ప్రథమాశ్వాసము




నాథా! గురునాథా!
నానా కల్యాణ గుణసనాథా! వ్రజకాం
తానాథ! విశ్వనాథా!
మౌనీంద్ర హృదబ్జనాథ! మాయానాథా!

చం॥ కరివరదా! భవార్తిహర! కంజదళేక్షణ! శ్రీనివాస! ము
ష్కరదనుజాదినాథ బలగర్వవినాశక! భక్తభక్త! శ్రీ
కర! కరుణాలవాల! కలికల్మషఖండన! నాగభూషణా!
హరిహరధాతృరూప! యభయప్రద! శాశ్వత! వేంకటేశ్వరా!

కం॥ నిమిషంబేమఱక యెనీ
విమలాంఘ్రి సరోజయుగము వీక్షించుచుని
ర్మముఁడౌ నీభక్తుని చరి-
తమిపమునంజెప్పువాఁడఁ ద్వచ్చరితంబున్.

కం॥ భగవద్భక్తుల భజనమె
భగవంతుని భజనమగును భావింపంగా
భగవద్భక్తుల చరితలు
భగవంతుని చరితలగుటఁ బన్నగశయనా॥

కం॥ హృత్కమలమందు నిన్నెపు
డుత్కంఠను దలఁచి కొలిచి యుష్మత్కథలన్।
సత్కవుల తెరువుఁబట్టి చ
మత్కృతి మత్కృతినిఁ దెల్పి మహిఁగృతి సగుదున్॥

ఆ॥ సుకవినికరమునకు జోహారులర్పించి
కుకవిజనులఁ బేరుకొనక విడిచి
శౌరి! నీకు నిత్తుసహృదయ మధుపంబు
లలరఁగావ్యమనఁగనలరు దండ॥

సీ॥ భక్తిరసహీన శుష్కవాక్ప్రౌఢివలనఁ
గవుల జామోదగరిమంబు గలుగునట్లె
వట్టివడగాలి తాఁకునవట్టివేళ్ళఁ
బుట్టునే తావి రసపరిప్లుతినిగాక॥

కం॥ సారాసార విచారము
భారతి, వ్యర్థప్రపంచ వాంఛావిరతిన్
శౌరి భజించెదనామన
సారఁగ భారతిని సరసిజాసను రాణిన్॥

కం॥ శీకరదనుఁ గొల్తునెవ్వడు
లోకవశీకరణు నాత్మలోన సుకవితా
ప్రాకట సింహాసనమున
శీకర శీకరముల నభిషిక్తుం జేయున్॥

గీ॥ ఆయువారంబునను జీవయాత్రఁ గడపు
హాసునిఁ బార్వతి వరియించినటులు సాధు
జనుల పంచల విజ్ఞాన శకలములను
గలుకొనువానినన్ వరియించెఁగవిత।
చ్యుతునిచేత భూషితుఁడయ్యె నెవ్వఁ
డవఁడు భూషణమైయొప్పు నిందుధరున
కట్టి నాగేశ్వరుని భక్తినభినుతింతుఁ
జిత్తమందున నెపుడు వాక్సిద్ధిఁగోరి॥
పరమేష్ఠిగురుని మల్లా
ప్రరామశాస్త్రి బరమగురుధీరున్ నాగే
శ్వరుఁగోరాడన్వయహిమ
కరు గురువరు నాగభూషుఁ గరమర్థింతున్॥
సీ॥ బాలులీలను శిష్యజాలంబుతో వేడ్కఁ
క్రీడించు గోపాలకృష్ణమూర్తిఁ
బ్రీతిమై శ్రితజన వ్రాతంబు కోరకే
వాంఛలొసఁగు శ్రీనివాసమూర్తి
విమత పాషండాది భేదవాదంబులఁ
జీల్చి చెండాడు నృసింహమూర్తి
కపట భక్తుల యహంకారంబుఁ ద్రొక్కించి
పాఱఁదోలెడు వీరభద్రమూర్తి
గీ॥ సకల దైవతమయమూర్తి సాధుకీర్తి
నవరసస్ఫూర్తి సచ్చిదానంద మూర్తి
సర్వసమవర్తి బుధలోక చక్రవర్తి
పుణ్యమూర్తిని నాగురుమూర్తిఁదలఁతు॥

కం॥ ఏషణ శోషణములును మ
నీషాజనకములఁదత్వనిష్ఠులకున్ సం
తోషణములు శ్రీవిద్యా
పోషణములు నాగభూష బుధ భూషణముల్॥

కం॥ శీధువును మించఁగల్గెడు
మాధుర్యముతోడ వెలసి మమతనహంతన్।
శోధించి నాగభూషణు
బోధము స్వాస్థ్యంబునిడు, ముముక్షులకెల్లన్॥

కం॥ ఉపమాన సహస్రములని
రుపమంబగు శైలిలీల నుపనిషదర్థం
బుపదేశించి ముముక్షుల
కపవర్గమొసంగు ప్రోడయహి భూషణుఁడే

ఆ॥ ఉల్లిగడ్డఁజూపి యుపనిషద్గోప్యంబు
నెల్లఁదానఁజూప నెవ్వఁడోపె
నెవఁడు విశ్వమందు నెల్లెడఁబరతత్త్వ
మరయఁజాలె నట్టిగురునిఁగొల్తు॥

గీ॥ కాంచినట్టివియెల్లను గాంచనముగఁ
జేయఁజాలిన యారససిద్ధు నటులు
గన్నదెల్లను బ్రహ్మంబుగాఁగఁదెల్పు
సముఁడు తత్త్వఘనుండు నిర్మముఁడు గురుఁడు॥

ఆ॥ తాత తండ్రులెంత దాఁచియిచ్చిరయేని
స్పర్శవేధి కలిమి సాటియగునె
శాస్త్రసంచితంబు జ్ఞానమెంతైనను
స్వానుభూతి భూతికౌనె సాటి॥

ఆ॥ చేతఁగాని రీతిఁ జేతులుజోడించి
స్థాణువటులు గురుల దరినిఁగొలువఁ
దరిని తఱుముకొని కదంబ కోరకముల
సరణి సకలసిద్ధు లరుగుదెంచు॥

ఆ॥ గురుఁడు శిష్యవరునిఁగరుణించుచందంబుఁ
దాఁచి కఠినునట్లు తోఁచుదొలుత
రాత్రిచరులఁజంప రాముఁ గోరినమౌని
సీత పెండ్లిమాటఁ జెప్పఁడయ్యె॥

గీ॥ పర్ణములడాఁగుతీఁగ సంపంగిలీల
బ్రహ్మవేత్తలు జ్ఞాన సౌరభమునింత్రు
కానరాకుండ గూఢులై మౌనులగుచు
నేర్పు నోర్పునుగల్గు తన్నిష్ఠులెవరొ
వెదకి సాధింత్రు వారిఁదద్విదులుబుధులు॥

ఆ॥ చెంతనున్నఁ జాలుఁజింతలెల్లనుమాని
చేరఁదీసి గురుఁడె శిష్యునిఁదన
యంతవానిఁ జేయుఁగాంత మాకర్షించి
తనదుశక్తి లోహమునకునీదె॥

గీ॥ అనుభవంబునఁ గాంచనియట్టి వట్టి
దంటమాటలు పల్కరీ దంటులెప్పు
డంబుజోదరుపదము సూదంటురాయి
నినుము చందానఁదన్మతి యొనయుచుంట॥

ఆ॥ న్యాయవాదివృత్తి కాయవారము మేలు
కలియుగమున నిజము కంజనాభ!

క్రోడమైన నీదు క్రీడను దలపోసి
బురదమునక యుండె పొరలుచుండు॥
క౦॥ కనకమున కంగలార్చుచుఁ
గనకని జరియించునన్నుఁగని, కరము, మదిన్
గనికర మెసఁగఁగ నన్నున్
గనకాంబర! చూపినావుఁ గనకాంబరహిన్॥
సీ॥ జ్ఞానబీజంబు నాకఘహారుఁడు నాకు
శాఖగా బెంచెఁ బెన్నన్న శిక్షమెఱయ
గద్దెగనకాంబ చేసె దోహదము దాన
ఫలముఁగంటిని నాజన్మ ఫలమదంటి॥
క౦॥ బ్రహ్మీభూతుని పౌత్రుఁడ
బ్రహ్మర్షిసుతుఁడ నదృష్టవశమున నాపూర్వాత్
బ్రాహ్మీవివస్యనుచే
బ్రహ్మణ్యుఁడనైతి శ్రీశ! ఫణిభూషకృపన్॥
సీ॥ సత్యపథవర్తి సాహిత్యచక్రవర్తి
దర్పకోపమమూర్తి విస్తారకీర్తి
దాంతుఁడనఘుఁడు నిఖిలవేదాంతవిదుఁడు
జనకుఁడగు వేంకటప్పయ్యశాస్త్రి మాకు॥
క౦॥ పుణ్యచరిత్ర పతివ్రత
పుణ్యకథాసక్త పూర్వపుణ్యోదితసా
ద్గుణ్య ప్రభావబంధు శ
రణ్యయు, దుర్గాంబయుంబరాజీ వాక్షా!
క౦॥ అగ్రజులు నాకు బ్రహ్మవి
ద గ్రేసరు లిద్దరాప్తుల లఘుమతులు నా

కగ్రాహ్య ధర్మసూక్ష్మము
న్నుగ్రహమునఁ దెలియఁబలుకు నుతచరితులిలన్॥

కం॥ బుధలోక మాన్యులును నవ
బృథ పరిపూతాత్ములార్య విద్యాకుశలుల్
విధిచోదిత పథవర్తులు
మధుసూదన! సూరివరులు మాతామహులై॥

గీ॥ వెలయుచురు వారిలోపల నలఘుమతులు
సూరిజనవంద్యుఁ డౌ రామసుబ్బశాస్త్రి
శ్రితజనావనరతుఁడు నృసింహశాస్త్రి
మాన్యులీయిద్దరును మేనమామలైరి॥

గీ॥ ఆత్మబోధంబుకొఱకు నహర్నిశంబు
భక్తవర్యుల చరితముల్ భావమునను
నిలిపికొనుటకు నిది మంచినెఱయఁటన్న
యాప్తవాక్యంబు భక్తిమైనవధరించి
పల్కితిని తులసికథ ప్రబంధశైలి॥

# షష్ఠ్యంతములు.

కం॥ నిష్కపటహృదయ సదనా
విష్కృతకల్యాణరూప విభవోన్నతికిన్
నిష్కలునకు సన్నిష్కుయునకు
నిష్కించనభక్తలోకనిధికిన్ విధికిన్॥

కం॥ జననమరణ రహితున కజ
జనకునకున్ దుష్టదనుజసంహారికి న

జ్జన రక్షాదీక్షితునకు
జనార్దనునకున్ విభునకు శార్ఙ్గధరునకున్॥
కం॥ సంకల్ప ప్రేరకునకు
శంకరమిత్రునకు భావజజనకునకు న
ప్పంకజనాభునకహింప
ర్యంకునకచ్యుతునకుం గనకాంబరునకునున్॥
కం సురవర సేవితునకు భూ
సురరూపునకాత్మ భక్తసురభికి హరికిన్
గిరివరదున కరిగణభీ
కరునకునజ్ఞానతిమిరకమలాప్తునకున్॥
కం॥ పురహర శరరూపునకు న్
హరికిన్ లక్ష్మీమనోవిహారికి నింద్రా
వరజునకున్ గురురూపున
కరవిందాక్షునకును భువనాధారునకున్॥
గీ. విన్నపంబుగ బుధలోకవిశ్రుతుండు
భక్తిసామ్రాజ్యపద పట్ట భద్రుడైన
తులసిదాసుని చరితమిటులను వినుతుం
జిత్తగింపుము దేవ! దాక్షిణ్యభావ॥



# కథాప్రారంభము.



కం॥ కాపురమై సిరులకు నల
కాపురిఁ బురుడించి రత్నకాంచనమయసౌ
ధోపేతయగుచు భువినా
గ్రాపురివిలసిల్లు నగ్రగణ్యంబగుచున్॥ ౧

కం॥ పావన యమునాభంగ
ప్లావితకుట్టిమ పదములు స్వర్లోకధునీ
సౌవర్ణాంభోజవరా
గావిలవలభీస్థలంబులా పురిమేడల్॥ ౨

కం॥ వెలలేని మానికమ్ముల
నిలువెల్లన్ స్థగితమగుచు నింగినొరయుచున్
వెలయున్ దుర్గము శత్రునృ
పులు చేరఁగ నలవిగాని బురుజులతోడన్॥ ౩

గీ॥ భారతీయుల మేటి శిల్పంబునొప్పు
నెఱపఁగా నింద్రనీలమణీ వికార
ములు గజంబులు దిగ్గజములోయనంగఁ
గోట తూరుపువాకిట నీటుఁగులుకు॥ ౪

కం॥ పురుహూతుని పురమునకున్
బురుడనఁదగు నాగ్రపురిని భూదేవులు డె
ప్పురములఁగుడుచుచు నకటా
పరతంత్రతఁ దేజమేది బ్రతుకుదు రెటులో॥ ౫

గీ॥ యవనదారాత్మజ మానభంగాపహతిననే:
భూసుర ప్రాంశు పూజముల్ బ్రుంచి పోవ:
జిక్కినక్కడు కబ్బకోకెరములటు
కొలఁది బాపలుమెలిరి గూఢవృత్తి ౬

సీ॥ యజ్ఞోపవీతముల్ యవనులు గనకుండ
షేర్వాణి మేనఁగ్రై సేయువారు
తురకలు బర్హిమై పెఱకకుండఁగజుట్టు
తురకకుళ్లాయిలోఁ దాఁచువారు
మొగలులకాతిథ్యము నొసంగనిడ్డలో
పాలుకన్కను గుడిగుడి నుంచువారు
సుద్యోగములఁ గోరి యుష్టిబావను నేర్చి
యలుపాలఁగొంపోయి యొసఁగువారు

గీ॥ నగుచునప్పటి భూసురులార్య వేష
భాషలను మాని వైదిక పథము విడిచిరి
ఉండెనో లేదో నూటికినొక్కరుండు
నిజకులోచిత ధర్మంబు నెఱపు ద్విజుఁడు ౭

కం॥ సామాగమ గానంబుల
నేమఱచుఁ గొరాను పాడియుం బాదవంగా
నోమరుఖాయముఁ జదివిరి
భూమీసురులార్ష కావ్యములు వలదంచున్ ౮

కం॥ సుక్షత్రియులై బహుసమ
రక్షత దృఢగాత్రుల మ్యుఁ బ్రారబ్ధమునన్
రక్షింపుమనుచుఁ గట! యవ
నక్షితిపతి భృత్యులైరి నగరపు రాజుల్ ॥ ౯

క౦॥ కులధర్మము వదలకజ
క్కులరాయని నిధులనైనఁ గొనఁగల్గిసిరిన్
దులఁదూఁగుచుంద్రు పురివణి
జులుసంతత దానరతులు సుకృతముకలిమిన్॥ ౧౦

గీ॥ అగ్రవర్ణాల వారలేయవిధఁ బడగఁ
బాదజులమాటవేఱ చెప్పఁగనేల
మాననీయులు పురిశుసల్మానులగుటఁ
గడఁగి యెల్లరు వారికింకరులైరి॥ ౧౧

గీ॥ యవనపాషండులీగతి నార్ష సంప్ర
దాయములకెల్ల దాయలై తనరమాను
షాగభూపతియైన ప్రహ్లాదునటులు
యవన సింహాసనంబున నక్బరొప్పె॥ ౧౨

క౦॥ శూరుఁడు ధీరోదాత్తుఁడు
సూరిజనవిధేయుఁడు పరిశుద్ధాత్ముఁడహం
కార విదూరుండక్బరు
భూరమణుఁడు శ్రేష్ఠతముఁడు మొగలునృపులలోన్॥ ౧౩

క౦॥ నవ్వాఁడు పరులమతములన
నెవ్వగమదిజెందఁడెట్టి నెగులుగలిగినన్
గ్రొవ్విన యపరాధులనే
నవ్వసుధాధిపుఁడు కరుణనరసిక్షమించున్॥ ౧౪

గీ॥ అరుణుఁడుదయించు వేళ మధ్యాహ్నమందు
సాయమందున నడిరేయి జనవిభుండు
నిజమతోచితమైనట్టి నియమమునను
భువన కర్తకు భక్తిమై మ్రొక్కుచుండు॥ ౧౫

గీ॥ చూడని వియన్ని యాపరంజ్యోతి కళలె
యంచు దీపంబులను, సూర్యు, నబ్జు, ననలు
భక్తిఁబూజించుచుండు నా ప్రభువరుండు
దినదినమ్మొక్క ప్రొద్దుండు దీక్ష మెఱయ ॥ ౧౬
గీ॥ తనివితీరని జిజ్ఞాసజనవిభుండు
శ్రవణ మొనరించు నెప్డుసద్గ్రంథములను
కడఁగి నేర్పరులైన లేకరులనేరి
ప్రతులు వ్రాయించు సద్గ్రంథ రాజికెల్ల ॥ ౧౭
గీ॥ భారతంబును శ్రీరామ ధర్మకథయు
నిషధ నాథుని చరితంబు నెన్నిమాఱుఁ
బారసీ భాష వ్రాయించి పేరుగన్న
చిత్రకారులచే తెరసి కవరుండు
తత్కథోచితమైన సందర్భములను
చిత్రపటములు వ్రాయించి చేర్చెనందు ॥ ౧౮
కం॥ నలుదెసలు కలియ వెదకిన
కలులను రావించియంతికమున సతతమున్
నిలుపుకొని వారిగోష్ఠిన్
దెలియున్ సకలంబు నతఁడు ధీచాతురిమై ॥ ౧౯
శా॥ శ్రీరామాంఘ్రి సరోజచింతన సుధాసేవా విలోలుండు స
త్కారుణ్యాంబుధి పాపదూరుఁడు మహాగంభీర చిత్తుండు నా
త్మారాముండఖిలాగమాంత విదుఁడా క్షత్త్రాణపారీణుఁడా
త్మారాముండననొక్కవిప్రవరుఁడయ్యాగ్రాపురిన్ భాసిలున్ ।
సీ॥ ఆత్మయే బ్రహ్మవిష్ణ్వాది దేవతలెల్ల
నాత్మయే నిత్యమైనట్టి వస్తు

వాత్మయే సత్యమానాత్మ యేతారక
మఖిలవిశ్వంబులు నాత్మమయము
లాత్మయే బ్రహ్మ మానాత్మ యేమూలంబు
ప్రణవాది సర్వమంత్రములకెన్నఁ
దత్త్వమిత్యాది దీనివర్ణింపఁగల్గిన
వారెగల్రెద రహంకార, మగ్గి

గీ॥ చచ్చినంగాని భవబంధజాలమూడ
దనుచు నెల్లప్పుడాతఁ డవ్యాజకరుణ
బోధ సేయుచు నుండు సమ్మోక్షమొసఁగఁ
గదిసియాచింపవచ్చి జిజ్ఞాసువులకు॥ ౨౧

కం॥ ఆత్మారాముఁడు గండీ
యాత్మే తరవస్తువితతమైనను లేదం
చాత్మజ్ఞానముఁ దెల్పుట
నాత్మారాముఁడతఁడ నఁగనవనిన్ బఱఁగున్॥ ౨౨

ఉ॥ ఆతని సత్ప్రవర్తనము నాతనిపాండితి సూక్ష్మబుద్ధియున్
జేతమునందు నారసి ప్రసిద్ధమొగల్ ధరణీధవుండు ప్రే
మాతిశయంబునం బిలువ బంచిస్వరాజ్యమునందుమంత్రిగా
నీతివిశారదుండతఁడని ల్పె బృహస్పతినింద్రుఁడు చాడ్పునన్॥

ఉ॥ లౌకికభోగవాంఛలనలంపటుఁడై మురవైరిపాద చిం
తాకలితాత్ముఁడయ్యును గతస్పృహుఁడయ్యును రాజకార్య మెం
తో కుశలత్వ మొప్పనతఁ డుత్సుకతన్ నెఱవేర్చుచుండునో
గా! కరణీయకార్యములఁ గౌశలమేసుమి యోగమారయన్॥ ౨౪

గీ॥ తీఱుబడిఁగల్గిన ప్రజెల్ల శ్రీయుతుండు
బ్రహ్మవిజ్ఞానమును దెల్పుఁ బాదుషాకు
నిక్కమైనట్టి జిజ్ఞాస నెలవుకొనిన
జాతిమతభేదమెంతు రే జ్ఞానివరులు॥ ౧౫

కం॥ జనకుఁడు రాజ్యంబట్టులు
జనవల్లభు దండనుండి సచివాగ్రణియై
జనపరిపాలనలీలన్
జనవంద్యుఁడతండు శాంతి సలుపుచునుండున్। ౧౬

కం॥ పాయక యెప్పుడు రత్నా
బాయి యనంబఱఁగు సాధ్వి వాల్లభ్యమునన్
దీయము పెంపై తనరెడు
తోయము సంగొలుచు భక్తితోడుత నతనిన్। ౧౭

ఉ॥ తారకమూర్తియైన వసుధాతన యాధవు పుణ్యగాథలం
గూరిచె నాదికావ్యమునఁ గోవిదుఁడెవ్వఁడతండె యీశ్వర
ప్రేరితుఁడౌచు భాగవతరీతులు దెల్పఁగఁ బుణ్యదంపతుల్
వీరని రత్నగర్భమున లీల జనించెను నోమువంటయై॥ ౧౮

కం॥ రాముని మఱి మఱి యాత్మా
రాముఁడు స్తుతియించె సుతుని రాకేందుముఖున్
రామా జనమనసిజునభి
రాముంగనుఁగొనుచు మదిని రత్న చెలంగన్॥ ౧౯

కం॥ ఇచ్చెను గోభూ కనకము
లెచ్చుగ ధరణీసురేంద్రులెంతయు మదిలో
మెచ్చఁగఁ, దులసీదాసని
యచ్చుఁఱుతకునామకరణమ్మొలిఁజేసెన్॥ ౨౦

గీ॥ శుక్లపక్షంబునం జూసి చొప్పు మెఱయు
దినదినంబున బాలుండు తేజరిల్లి
తల్లిదండ్రుల మనసు రంజిల్లుచుండ
వరుస నైదేండ్ల ప్రాయంబు వాఁడు గాంచె॥ ౩౧

కం॥ భవభవమై భవహారమై
భువి నెయ్యోగాస్యమయ్యె మునివృషభులకా
శివపంచాక్షరి యతనికి
నవితథముగఁ జేసి రక్షరాభ్యాసంబున్॥ ౩౨

ఆ॥ తివిరి యోగమాల దిద్దించు నాఁ డెద్ది
మాణవకుఁడు నేర్చె, మానుల దియె
జపము సేయుచుండు సంసారముక్తికై
మొదలెతుదయు నిత్యపూర్వమునకు॥ ౩౩

గీ॥ అక్షరజ్ఞానపూర్ణుఁడై నట్టి తండ్రి
యక్షరాభ్యాస మొనరించె నతనికిట్లు
తొలుత నాటిన బీజంబె మొలచి పెరిగి
శాఖలై పుష్పఫలములఁ బొసంగుఁగాదె॥ ౩౪

కం॥ తులసీ దాసంతటని
స్థులమగు విజ్ఞానగరిమతోడుత వేదం
బులను దదంగంబులనున
ఖిలమగునితిహాసచయముఁ గ్రీడన్ నేర్చెన్॥ ౩౫

చం॥ అతని ప్రబోధచంద్రుఁడు పదారుకళల్ దనుఁజెందఁ [బూర్ణుఁడై
యతులితలీల నొప్పెను పదారవయేటి కనంతరంబునన్
మతిఁదలపోసెఁ దండ్రియసమాన సురూప సుశీలసంపదు

న్నతి వెలుఁగొందునట్టి యొక నాతినిఁ గూరిచి పెండ్లి సేయఁగన్

గీ॥ కులము గోత్రంబు గుణమును దెలిసి రాసి
వింతపడుచుల కాసించి వెతలఁబడక
మేనమామ కొమారిత మేలఁటంచు
మమతయను కన్యకామణి మమతఁ దెచ్చి
పరిణయముఁ జేసె జనకుండు వైభవమున॥ ౩౮

గీ॥ ప్రతిదినంబును దనతోడ రాజసభకు
సుతుఁ గొంపోయి లోకము వితముఁ జూపి
చెంతనాసీను గావించి చెప్పుచుండు
రాజనీతి రహస్యంబులోజ నిటులు॥ ౩౯

ఉ॥ భామలచిత్తవృత్తులటు పార్థివచిత్తములోకుమారకా!
ప్రేమముఁ బైకిఁ జూపిరని పేఁగుచు నేమఱుపాటుఁ జెందియా
గాము లెఱుంగకుండ నధికంబుగ నమ్మి చరించుటొప్పెవాఁ
బాములతోడఁ జెల్మి సుమి, పార్థివ సఖ్యము లెంచిచూడఁగన్॥

కం॥ వాద ప్రతివాదంబుల
భేదము మదినరసిచూచి విజ్ఞతతో మ
ర్యాదా తిక్రమణము లే
కౌదార్యముతోడఁ దీర్పనౌ వాదంబుల్॥ ౪౦

కం॥ హితులైన నహితులైనను
మతిలోపలఁ బక్షపాతమాలిన్యము లే
క తిశుద్ధబుద్ధి న్యాయం
బతులితగతిఁ జెప్పు సచివుఁడాప్తుఁడు పతికిన్॥ ౪౧

గీ॥ ఉల్లమందున శాంతిఁ బూర్వోత్తరముల
నరసి యధిపుఁడు తన్నడ్గునట్టి ప్రశ్న

నుత్తరంబీయ నొప్పును తత్తరంబు
హానిఁదెచ్చును మంత్రికే నధిపునకును॥ ౪౨

గీ॥ దయయు ధర్మంబు విడనాడి ధరణివిభుఁడు
ప్రజల కపకార పరుఁడౌచుఁ జఱఁగెనేని
యుచితరీతుల బోధించి సచివవరుఁడు
మంచిత్రోవకు నతనిఁదే నెంచవలయు॥ ౪౩

చం॥ సచివుఁడనేను నాకెవరు సాటియటంచు మదంబు పెంచి నీ
చచయముఁజుట్టుఁ జేర్చుకొనిసాధులబాధలఁ బెట్టకుండఁ బా
పచకితుఁడౌచు న్యాయపరిపాలనచేసెడు మంత్రిసత్తముం
డుచిరముఁ గీర్తిగాంచుచుఁ గడుంజగమందునఁ బెంపుఁ
జెందెడున్॥ ౪౪

గీ॥ సాధుసేవయె సంసార సాగరమున
మునిఁగి తేలెడు గేస్తులౌ జనులకెందుఁ
బరమతారకమల్లాట భాగవతుల
స్థితిగతులు గనిపెట్టి పూజింపవలయు॥ ౪౫

గీ॥ అష్టగజములుగావు శేషాహిగాదు
భువనభారంబుఁదలపైన మోయుటరయ ౪౬
సాంద్రకాననములయందు జపము సేయు
తాపసియె నిల్పుధారణి ధర్మమెల్ల॥

గీ॥ దట్టమైనట్టి యడవి సుధర్మయగును
సౌధశోభితనగరంబు సంద్రమగును
సాధుజనము ల మహిత తేజంబువలన
వారినొప్పించి రాజులు బ్రతుకఁగలరె॥ ౪౭

కం॥ ఎన్నిగుణంబులుగల్గినఁ
బున్నము లెన్నెన్నొ చేసి పొగడితఁ గన్నన్
సున్నయగు నన్నియును నో
యన్నా! యొక శాంతి లేని యాత్మ పెగ్గడకున్! ౮౮

సీ॥ శాంతియే సర్వార్థసాధకంబగు విన్ము
కలదు ప్రాక్తనమైనకథ యొకండు
వసుధలోపల మున్న వంతియన్ పురియందు
విప్రవర్యుఁడొకండు వెలయుచుండు
నాతండు గృహమేధి యయ్యును సతతంబు
నధ్యాత్మతత్త్వంబునందు నిలిచి
యచ్యుతంబైన బ్రహ్మానందమనుభవిం
చుచు నంత్యదశయందు సుతునిఁ జూచి

గీ॥ సాధుసేవయు నబ్జాక్షుచరణసేవ
పరమవైరాగ్యమును భవవార్ధి దాఁటఁ
బంచజనులకు నెంచ నుపాయములని
బోధసేసినఁ దెలియని మూఢుఁడతఁడు॥ ౮౯

ఉ॥ నాయన! నీవు పోయిన నా గతి యేమగు నాకుఁ బెండిలిఁ
జేయు నెవండు కానుకఁ దెచ్చి యొసంగ వయింక నెట్టులేఁ
జేయుదు జీవనంబనుచు సిగ్గెడఁగ్గలమైనరీతి వా
పోయెనుడంకియున్ సుతుని బుద్ధికొకించుక నవ్వి
యంతటన్ ౯౦

గీ॥ శాశ్వతంబుఁ జెప్పించి దానికైన
సాగరముకంటెఁ గొప్పది శాంతియనుచు

ప్రాసి కొసపొమ్ము దీనిని రాజుకడకు
ధనమునతఁడిచ్చు నీ దరిద్రతయడంగ॥ ౫౧

క॥ అని చెప్పి విప్రవర్యుఁడు
ఘనబోధము మదిని వెలయఁగా శాంతిం గై
కొనెఁ గైవల్యపదంబును
ధనసుతదారాదులందుదాసీనుండై॥ ౫౨

చ॥ జనకునియుత్తరక్రియలు సర్వముఁదా నెఱవేర్చియంతనా
తనయుఁడు తాటియాకుఁదనతండ్రిచెప్పినరీతి జనికిఁ
వినయముతోఁ బనీయఁగనృపతినిఁ గైకొని దీని నెవ్వరో
ఘనులు లిఖించిరంచుఁ గడు గౌరవమొప్పఁగఁదాళపత్ర
ముఁ॥ ౫౩

క॥ తన కత్తియొఱనునిడుకొని
మను జేశుఁడు విప్రబాలు మన్నించి తగన్
ధనమిచ్చి యనుప నాతఁడు
చనెజనకుని మెచ్చుకొనుచు సంతోషమునన్॥ ౫౪

క॥ అంతట వేడుక నా భూ
కాంతుఁడు వేటాడఁజనియెఁ గానన సీమన్
శాంతాత్ములైన తాపస
సంతానమునొంచు జంతుసంతానములన్॥ ౫౫

గీ॥ వన్యమృగముల వెనుకొని పారి వృందు
తఱుమఁ దఱుమంగఁ గానలోఁ దరణిగ్రుంకె
మర్లుమాతంగి మెట్టెనో మనుజవిభుఁడు
దారిఁదప్పుచుఁ గానలోఁ దారితడసె॥ ౫౬

సీ॥ రాజుతడసిన యవ్వేళ రాజశయన
మందిరంబున శయ్యనమరుచుచుండి
యచటి శృంగార వైభవమంతఁజూచి
చాకియొక్కఁడు మదిలోనఁజాలమెచ్చి॥ ౫౭

చం॥ జతనముతోడనిత్యమును చక్కఁగనీశయనీయమేనయా
యితమొనరింతురాజునకు నెన్నఁడెఱుంగనుదీనిపాయి నీ
యతలఘుదిండ్లకైనక్షణమైనను నామెయిఁజేర్చితీర్తు నా
కుతుకమటంచు నావెకలికొంకకపాన్పునమేను
వ్రాల్చినన్॥ ౫౮

సీ॥ మేను వ్రాల్చినయంతనే మింటికెగసి
నట్టులయ్యెను బ్రాణము లంత, రాణి
లోనికేతెంచి మృగయావిలోలుఁడగుచు
ఖేదుఁ శ్రమఁజెంది నిద్రించినాఁడటంచు॥ ౫౯

ఉ॥ పానుపుపైన నారజకు పక్కనె మెల్లన మేను వ్రాల్చి య
మ్మానిని లోనొకింత యనుమానము నూనకవానితోడనే
తానునునిద్రపోయెనట ధాత్రిధవుండు నిశీథవేళ కుం
గాననసీమనుండి యధికంబుగ డస్సి గృహం
బుఁజేరుచున్॥ ౬౦

ఉ॥ అంతిపురంబులోనికి రయంబున నంతట నేగి యాత్మనా
యంతయుశేం లేమె సుఖాతిశయంబున వింతవాని య
త్యంతికమందుఁ దాశయితమై తనరారెడునాత్మపత్ని భూ
కాంతుఁడు చూచి యిర్వురను ఖడ్గమునం దెగ వేయ నెం
చుచున్॥ ౬౧

గీ॥ క్రోధఘూర్ణిత నేత్రుఁడై కువలయేశుఁ
డసిని యొఱనుండి వెలుకుచు నదయుఁడగుచు
నఱుకఁగ మకించునంతలో నాటి తాటి
యాకు వ్రాలెను గింతగ నతనిముందు॥ ౬౨

గీ॥ తాళపత్రంబు నద్దాని ధరణిసురుఁడు
తనకునిచ్చిననాటియుదంతమంత
విస్మృతంబైన కతమున వేల్పులెవరొ
దీనిఁ బడవైచిరంచు భూజానిదాని॥ ౬౩

గీ॥ విస్మయంబున దీపంబు వెలుఁగులోనఁ
జదువఁబోయెడు నంత నాగది వెలుపల
వేచియున్నట్టి సచివుండు వేగిరమునఁ
బఱచెలోనికి విభుని సంభ్రమముఁ జూచి॥ ౬౪

గీ॥ మంత్రిరాకను గాంచి యమ్మనుజవిభుఁడు
చదువమానుచు రాణి దుశ్చరిత మెల్ల
బట్టబయలయ్యెఁ దడసినఁ బరువు నక్క-
దనుచు నఱుకంగ నసిదూయు నవసరమున॥ ౬౫

చం॥ తటుకున మంత్రియడ్డమయి ధర్మముగాదిది రాజచంద్ర! నీ
విటులవిచారతన్ సతినహీన గుణాఢ్యను నిద్రలోన నే
పటుకరవాలధారఁ దెగవైచెదె? తాళమునాతఁడెవ్వఁడో
యుటమట కాఁడు రాజసతి యందొకదోసము లేదు చూడఁ
గన్॥ ౬౬

గీ॥ పరువునకు నీవు భూమీశ! పరువు లెత్తి
చేయఁబోకుము కార్యంబు బోయచాయ

ఉ॥ దారిత వైరి వీరుఁడగు ధాత్రిత లేశుని వట్టుపాన్పుపై
పైన్పఁత నెట్లు రాఁ రజకపాంసనవండుకొనంగఁ గుండియల్
ధీరత నూరె నీకు బలతేజసమున్నతుఁడైన వేఁడుని
న్నారసినట్టులైన తిలలంతలుతున్కలుగాఁగఁ గోయఁడే॥ ౭౯

గీ॥ నిక్క మెఱిఁగింపు పాన్పున నీవు వక్క
పండుకొని నిద్రఁ జెందిన వారలెవరొ
యనుచు గద్దించి సచివుండు తనున డుగఁగ
వినయ వినమిత గాత్రుఁడై యని యెఁజాకి॥ ౮౦

ఉ॥ వెకలితనాన నే నృపుఁడు వేఁటకుఁ బోయిన వేళ వేచి పా
యక మదిఁ బొంగు కౌతుకమునాఁగఁగఁ జాలక మంచి వేళవి
న్నకకడ వంగఁ బెట్ట మఱినాకు లభింపదటంచు నెంచి నే
నొకత్రుటి విశ్రమింతునని యుబ్బునఁ బాన్పున మేను వ్రాల్చి
తిన్॥ ౮౧

గీ॥ ప్రతిదినంబును నిచ్చోట రాజుసెజ్జఁ
జక్కఁ జేయుచు నామది నొక్కనిముస
మేని దీనను బండిన మేను గలుగు
ఫలము గల్గునటంచు మనుదలఁ చితలఁచి॥ ౮౨

గీ॥ సెజ్జపైనట్టి నామేనుఁ జేర్చినంత
మత్తుమందును జల్లిన మాడ్కి విగత
చేతనుండైతి నిపుడు నీచేతి దెబ్బ
తగులు నంతకు నెఱుఁగ నేతగులమనఘ॥ ౮౩

గీ. ఒంటినుంటిని సెజ్జపైనొఱగు నపుడు
నిదుర మేల్కాలించి యెదుటను నిన్నుఁగంటి

ఏడుకొండల వెంకన్నతోడు సుమ్మి..
యింతకంటెను దెలియనే సుంతయైన॥ ౭౪

గీ॥ చాకిలేకిని మతిమాలి సచివవర్య
తప్పుసేసితి మనువుమదయదలిర్ప
ననుచు మ్రొక్కంగ యాథార్థ్యమును గ్రహించి
సేవకునిఁబిల్చి బందిలోఁజేర్చె మితని॥ ౭౫

కం॥ అనివానిఁబంపి సచివుఁడు
మనుజేశునిఁజేరి రజకుమాటలు వింటే
కనరాదు దోస మింతయు
ననుమానము మాను రాజ్ఞి యనఘాత్మ సుమీ॥ ౭౬

గీ॥ అనుచు సచివుండు చెప్పిన నవనిభర్త
వినియు విననట్టులుండిన వితము రాజ్ఞి
ప్రక్కగదినుండి కనిపెట్టి వనటఁజెంది
విభునిదరిఁజేరి మెల్లనవిన్నవించె॥ ౭౭

మ॥ అనుమానింపకు మయ్య! నాయెడల రవ్వంత్తైన దోసంబుగ
ల్గునె? సామ్రాజ్యరమా సతీరమణ! నీకుంగూర్చు పట్టంపు రా
జ్ఞిని నీచాత్ముని వానినంటుమనె నీనిస్త్రింశధారాక్షతం
బనఘా! చాకినఖాంక పాళికిని మే లౌనింతని నిక్కం
బునూ॥ ౭౮

గీ॥ నిదుర యదనున నీ రేయిగదికివచ్చి
పాన్పుమీఁదను బండిన వానిఁజూచి
నాదుపాపంబు పండెనో నాథ! నీవె
వేఁటబడలిక నిద్రించితోటటంచు॥ ౭౯

మ॥ ధరణీనాథ! వచింతుసత్యము నిద్రాభంగముంజేయునో
డిరవంతేనియు నన్ను నేపకరయొ నిద్రా ప్రాప్తమైనైశయ్యా ని
ద్దురకుంజొచ్చితి నంత నెపనెప్పు ప్రతత్యాహంబునన్ లేచినా
పొరపాటున్ గ్రహియించి నిద్రలేచనా మూఢత్వమున్ సై
పవే ౯౦

కం॥ అని మనవిసేయ విని యన
ఘనుజేశుడు భామినికి వినుమనపన్ వళమీ
జనములనోళ్లం గట్టగ
జననిందకులోకువయ్యె జానకి మైనన్॥ ౯౧

గీ॥ రజకుసరసను నిద్రించి నాయమనుచు
సైచె రాజది కనులారజూచి యనుచు
ఇంక నేమేమి యాడరు శంకమాని
తెల్లవారిన తోడనే యెల్లవారు॥ ౯౨

ఉ॥ శారదచంద్ర చంద్రికల స్వచ్ఛత నవ్వెడుచారుకీర్తి పెం
పారుగుణోన్నతిన్ బజెుగు నట్టిదె జన్మమనంగనౌదురా
చారపరాయణత్వము నసైర్వరతనున్న మనుష్య జన్మమే
లా? రనమేలుగావుకొ? లంశాయము లాదిగగల్లు జన్మ
ముల్॥ ౯౩

గీ॥ సకల వర్ణాశ్రమాచార సరణి ధరణి
నిలుపు భారంబు వహియించు నేతనైన
నేనయెట్లులు నీదుదుర్కీర్తిదాచి
నాచికొందును నాకీర్తినాతి! చెపుము॥ ౯౪

చం॥ పలుకులు వేయునేలయిక భామిని! నీ చరితంబులోపలన్
గలుషత సుంత లేదనుచుగల్లవచింపవయేని చెప్పెద న్

కం॥ వినయముఁ బ్రణయము శోకం
బును మనమున సందడించి ముప్పిరిఁ గొనన
వ్వనజాక్షి రాజుతోని
ట్లను భావముతోఁ బ్రమాటలాడెడు వేళన్॥ ౧౦౦

కం॥ పాపము! పాపధ్వాంతం
బేపారదు రాజ్ఞమదిని నెంతయు ననుచున్
భూపునకుఁ జెప్పనోయః న
వ్యాపించెను వెలుఁగు తెల్లవాఱెను దిశలున్॥ ౧౦౧

ఉ॥ తైలకటాహ మందల సుధన్వునిపోలిక రాజ్ఞ నేఁడుస
చ్ఛీలము ధారణీ స్థలిఁ బ్రసిద్ధికి నెక్కఁ బ్రతిష్ఠఁ జేయఁబే
రోలగమందుఁ గాంతునని యుత్సుకుఁడై వెసఁ దూర్పు
గొండపైఁ
గ్రాలెనుగర్మ సాక్షి నిజకాంతుల ధ్వాంతముఁ బాఱద్రోలు
చున్ ౧౦౨

ఉ॥ అంతట మేదినీశుఁడు సభాంతర సీమకునేగుదెంచి సా
మంతపురోహితాదుల నమాత్యులఁబిల్వఁగఁ బంచి చెప్పిని
శ్చింత నొకింతయేనియు విస్పష్టము సేయక యాత్మపత్నివృ
త్తాంతము సభ్యులెల్లఁదన ధర్మరతిన్ బళి! యంచు మెచ్చఁ
గన్॥ ౧౦౩

కం॥ మెచ్చుకొను సభ్యులెల్లరు
ఱిచ్చపడంబలికె నంతఱేఁడుగనుండీ
చిచ్చునఁగాఁగెడు తైలముఁ
జొచ్చెడు నాభార్య తన విశుద్ధతఁ దెలుపన్॥ ౧౦౪

కం॥ అని యనుచరులను బనిగొని
మనుజేశుఁడు ఖైరవముగ మసలఁగఁ జేసెన్
బెనుబానలోన నూనియఁ
దనపత్నిఁ బరీక్ష సేయ ధైర్యయుతుండై॥ ౧౦౪

సీ॥ గ్రీష్మర్తువునఁ గడుసూష్మచే పసివాడు
లతకూన వితమున డయ్యు దాని
వర్షకాలంబున వనదంబులట్టులు
కన్నీటిబిందువుల్ గార్చుదాని
మోడులౌ శిశిరర్తుభూజంబులట్టులు
భూషణంబులసూడ్చి పొలయుదాని
శరదబ్జచంద్రికా స్ఫారతేజము వ్రాలె
నకలుషంబగు చిత్తమరుదాని

గీ॥ రచ్చకెక్కంగ నెట్టోర్తుఁ బ్రజలయెదుట
ననుచు సీతున వడఁకెడు ననువుదోఁపఁ
గంపమొందెడుదాని నక్కాంతనంతఁ
గొల్వుకూటంబునకు రాజు పిల్వఁబంచె॥ ౧౦౫

గీ॥ మగని యాజ్ఞానుసారియై మగువమిన్న
నిండుకొల్వున కేతెంచి నివ్వెఱగప్పు
నిప్పుచందాన నిలుచున్న యుప్పుఁగాంచి
మంత్రియిట్లనె రాజుతో మంతనమున॥ ౧౦౬

ఉ॥ విన్నప మొండునీకుఁ బృథివీవర! చేసెదనల్ల, తాటియా
కున్నదిగాదె నీకడ మహోన్నత సత్త్వముదానఁగల్గు నం
చెన్నఁడుఁ దైలభాండమున నిప్పుడు దానిని వైచి చూతమీ
యన్నులమిన్న దాననఘయైనను నయ్యది కాలకుండెడున్॥

కం॥ కానిమ్మట్లేయని భూ
జానియు నందులకు నొప్ప సచివుండంతన్
నూనియగ్రాఁగెడు బానను
బూనికతోఁ దాటియాకు భూపుఁడు సభ్యుల్॥ ౧౦౯
గీ॥ చూచుచుండఁగ నద్దాని వైచియనిమెఁ
బుణ్యచారిత్రయా నేని భూపపత్ని
తైలవహ్నికి నిప్పుడు తాటియాకు
కాలకుండఁగ స్వచ్ఛమై క్రాలుఁగాక॥ ౧౧౦
గీ॥ తాళపత్రంబు నటుపైనిఁ దైలమందుఁ
గొంతవడియుంచి విస్మయాక్రాంతుఁడగుచు
సభ్యులెల్లరు వినఁగనా సచివరుఁడు
పలికె నిట్టులు విస్పష్టభాషణముల॥ ౧౧౧
ఉ॥ చిత్రమయారె! మంబరము సేయదు మండెడు తైలవహ్నియీ
పత్రముఁ జూడుఁడీ సభికవర్యులు రాజ్ఞి సతీత్వమెన్న సా
విత్రి ధరిత్రిజాతముఖ విశ్రుత పుణ్య సతీలలామ చా
రిత్రలఁ బోల్పనౌనిఁకఁ బరీక్షలతోఁ బనియేమి చెప్పుఁడీ॥ ౧౧౨
గీ॥ అని యమాత్యుండు పలికెడు నంతలోన
నంతఁ దనుకను వంచిన యాననంబు
మెల్లమెల్లనఁ బైకెత్తి మేదినీశుఁ
గాంచి యిట్టనిపల్కె నక్కాంచనాంగి॥ ౧౧౩
ఉ॥ ఇంతకు వచ్చినంతట మహీవర! చాలునె తాటియాకునా
స్వాంత విశుద్ధతన్ సభికవర్యుల ముందటఁ జాటిచెప్పనీ
చెంతను మిన్నకుండిన విశృంఖలవృత్తిని వీరియిండ్లలో
మంతిరి,యాకుపైఁ బసరు,మందెదొ పూసెనటంచు నాడరే!॥

కం॥ అనియంత నారికేళముఁ
గానిరమ్మని దాని నూనెకుంతను వైవం
గను, బెటిలునఁ గడివగాలిఁ
గని క్రచ్చఅరాతి నూనెతోఁ ... ముమికెన్॥ ౧౧౫

గీ॥ కంతదఘ్నంబు గా నానె ... త్రైల
మందు నిలుచుండి కంటక ... గించె
నీటమున్గిన తామరతూఁటి నైకఁ
దేలి వికసించు కెందమ్మి కేలుఁగుదోఁప॥ ౧౧౬

శా॥ చేతుల్ మోడ్చి నమస్కృతుల్ సలిపిరాశీతాంశు
బింబాస్యకున్
జేతోవీథుల భక్తిపొంగఁగ సభాసీనుల్ ప్రహృష్టాత్మలై
మాతా! పూతములయ్యె జన్మములు యుష్మద్దర్శనప్రాప్తివి
ఖ్యాతింబొందుము సీతరీతియని యుత్కంఠన్ బ్రశంసించు
చున్।

చం॥ అకలుష చిత్తయా మగువనాఙడి వెట్టితినంచు సిగ్గునన్
వికలమనస్కుఁడై యపుడు ప్రేయసి మోమునుజూడలేమి
న్నకసమితోత్తమాంగుఁడగు నాథునిజూచి సతీలలామ చెం
తకుఁజని వానిపాదములఁ దస్సయి భక్తినివ్రాలె నంతటన్।

ఉ॥ అప్పుడు గాంక్షి వెల్గిపిసయన్ నరపాలుఁడు లేవనెత్తి దాఁ
గ్రుచ్చికవుంగలించుకొని కంటఁ జలముల్ సవరించి మానినిన్
మెచ్చుచు మంత్రిసత్తముని మేయ ముదంబునఁ జేరబిల్చి యే
మిచ్చిన దీరు నీ ఋణమహీనగుణాకర యంచు మ్రొక్కెనన్॥

ఉ॥ రాణనురాజ్ఞిబాష్పములురాల నమాత్యుని పాదపద్మముల్
పాణులనంటి మ్రొక్కుచు నపారకృపాకరఁనేఁడు నీవునా
ప్రాణముమాన మొక్కవడి రక్షణఁజేసితి తండ్రివౌచు వి
న్నాణముఁ జూపియంచును ప్రణామముఁ జేసెఁగ్రమ్మఱఁ
నెమ్మిమై॥ ౧౨౦

కం॥ వింటే యీకథ పుత్రక!
కంటివ్రకోశాంతి వలనఁగల్గు ఫలంబే
వెంటన్ నీమదిఁ దత్తర
మంటఁగనీకుండ సల్పుమా కార్యంబుల్ ౧౨౧

గీ॥ స్వాతమమందున నభినివేశమును విడక
పరమతంబులు సైరింపభావ్యమగును
దత్వమెన్నంగఁ బరదైవతం బొకండె
విశ్వమంతటఁ బూర్ణుఁడై వెలయుకతన॥ ౧౨౨

కం॥ అనియిటు లాత్మారాముఁడు
తనయునకుఁ రాజనీతి తత్త్వము మదికిం
పొనరఁగఁ దెలుపఁగ శ్రద్ధన్
విని సునిశితబుద్ధి యతఁడు విజ్ఞుండయ్యెన్॥ ౧౨౩

కం॥ వేంకటనాథా! నిజపద
కింకర కైంకర్యలోల! కితవవిదూరా!
శంకర! దురిత తమోనా
శంకర! సకలార్థసాక్షి! సర్వేశ! హరీ!॥ ౧౨౪

మా॥ భుజగపతికలాపా! భూరికల్యాణరూపా!
నిజజనపరిపాలా! నిర్వికారాత్మలోలా!
అజహరిహరమూర్తీ! ఆర్త రక్షాచ్ఛకీర్తీ
విజయరథకుటుంబీ! విజ్ఞపక్షావలంబీ! ౧౨౫

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహా విద్యాపీఠ స్థాపనా
చార్య శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్షలబ్ధ
సారస్వతోపాసనాసాదిత సరస కవితావిలాస
శ్రీనివాస కవికృత తులసీదాస చరిత్రం
బను మహా ప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము
ఓమితి శివం.



నధ్యాత్మచర్చల మాధ్యస్థ్య మొనరించి
సిద్ధాంతములఁ దేల్చి చెప్పుచుండుఁ
బండిత కవులతో వాక్యార్థములు సేసి
తారతమ్యము లెంచి గౌరవించు
సంగీత నృత్యప్రసంగంబుగల్గు వో
మేలుకీడుల నెంచి మెచ్చుకొనును

గీ॥ ఆటపాటల వేఁటల మాటలందు
రాజసత్తమునకు బహిఃప్రాణమగుచు
నొక్కక్షణమేని పాయక యుండు నెపుఁడు
సకల విద్యాప్రవీణుఁడా సచివవరుఁడు ౪

॥ అంతట సార్వభౌముఁడు మహావిభవంబుఁ జేర్చి యొక్కనా
సంతదినాంతమందు దొరసానులు చుట్టుచుఁ జేరికొల్వ నా
భ్యంతరమందిరమ్మున సుఖాసనమందిరనంది భోగవుం
గాంతయొకర్తు దా భరత గానకళాగరిమన్ వెలార్పఁగన్ ౫

కం॥ రాణులుఁ దానును సత్తతి
రాణదలిర్పంగ మదిని రసవంతంబౌ
నేణీశోభన నృత్యము
నానాటను గానంబునందు నయాగారంబుగ॥ ౬

గీ॥ మెచ్చి యచ్చెరువంది యమ్మచ్చెకంటి
పాట వినుపించు వేడుకఁ బార్థివుండు
మంత్రిసత్తమునచటికా మంత్రణంబు
సేయఁబంచెను దగినట్టి సేవకులను॥ ౭

చం॥ నరపతిపిల్పునందుకొని నర్తకిఁజూడనమాత్యుఁడంత సం
బరమున రాఁగ, వేశ్య కని, బాపురె! యీనవమోహనాఁగు సుం
దరవదనారవిందరుచి, దర్పకుదర్పమధఃకరించు; నీ
సరసునిఁగూడకున్న నిఁకజన్మమదేలని చాలమెచ్చుచున్॥

గీ॥ కేలుఁదమ్ములు మోడ్చి యవ్వాలుఁగంటి
నిటలతటమున ఘటియించి నీటుగులుక
మ్రొక్కి కెంగంటిచూపులఁడక్కులాడి
చూచి సచివుని చిత్తంబుఁజూఱఁగొనియె॥ ౯

గీ॥ పార్థివుండంత సచివునివంకఁజూచి
వేడుకయ్యెను విబుధేంద్ర నేఁడు మాకు
దీని విద్యాతిశయమును దేల్చిచూడఁ
దరిచిచూడుమటన్న నాదరము మెఱయ॥ ౧౦

సీ॥ కళ్యాణిరాగంబుఁ గాన్పింపు మొక్కింత
బయలుపరుపు చక్రవాకమింక
నీలాంబరమొకింత నేర్పుమై సవరించి
మోహనాకృతిఁ జూపు ముద్దుగుమ్మ!
భూపాలరాగంబు పొసఁగదిత్తఱిఁ దన్ని
దర్బారెఱుంగవే తరుణి! నీవు?
కోకిలధ్వని చాలఁ గువలయాక్షి! మేలు
'ధన్యాసి' మెచ్చితి తరళనయన!

గీ॥ చాలనొప్పెఁడు బొలవసంతమిట్టి
తతిని సుఖమిచ్చు మలయమారుతమదెంతొ

మదికి నింపర్యో సింహేంద్రమధ్యమనుచుఁ
గొనరిపాడించె సచివుండు విసువులేక॥ ౧౧

గీ॥ గాహానము సేసి యీరీతిగానలహరి
లాస్యశృంగార లీలావిలాసములను
అభినయాభ్యాసనైపుణీ విభవములను
గాంచి లాహిరి గ్రమ్మినకరణిదోఁప॥ ౧౨

కం॥ పరవశుఁడై యతఁడుండిన
పరుషముఁదాఁగాంచి వారభామిని నావా
గురఁదగులుకొనియె నితఁడని
మురిసెనుమదిలోన సచివముఖ్యుండంతన్॥ ౧౩

గీ॥ ఉర్వీనాథుండుదన దండనుంటఁదెలిసి
తెప్పిఱిలిసానిదానికి నప్పనంబు
లొప్పువిధమున నిప్పించి యూహఁగలఁగి
వేదురుంగొన్న విధమున వెడలుతఱిని ౧౪

కం॥ సామీ! వనివినియెదనని
చామీకరగాత్రవాని నరసకుఁజన, నీ
నామంబేమీ? మీనా
క్షీ! మాకెఱిగింపుమన్న సింగారముగన్॥ ౧౫

కం॥ నగరాజకుమారీ! యని
నగరంబునఁ బిల్చుచుండ్రు నన్నందఱు నా
సొగసునువిద్యయు సరసుఁడ
మిగులఁగ శోభిల్లెసీవు మెచ్చినకతనన్॥ ౧౬

కం॥ రచ్చలఁబాడెదు పాటల
మెచ్చెదవునె? సచివవర్య! మీదయయున్నన్

విచ్చలవిడిమాయింట వి
యచ్చరగాయనుల మించుతునశ్రమలీలన్॥ ౧౭

కం॥ అనిజాణ తనము మెఱయం
గనుబలుకఁగ సచివుఁడంతఁ గాని మ్మిటుపై
ననువగుసత్తఱఁగనియెద
ననఁబోఁడిరో! నీదుగాననాట్యశ్రీలన్॥ ౧౮

గీ॥ అనుచునమరయోచితంబుఁగ నాడి వార
కాంత సెలవిచ్చి పంపి విభ్రాంతుఁడగుచు
విశ్వమెల్లనులో వెలి వేశ్యగాఁగ
సేవకులుదారిఁ జూపఁగఁ జేరెగృహము ౧౯

చం॥ అరమర లేని ప్రేమ నయనాబ్జయుగంబునఁ జిందు లాడఁగ
సరసకువచ్చుభార్య వీరసంబుఁగ నావలఁద్రోసి లోఁ కిన్
సరసర నేఁగి శయ్య నవశంబుగ వ్రాలుచు నుస్సురంచునున్
జ్వరితునిఁ బోలెఁ జేపవలఁ బడ్డవిధంబునఁ దాపమొందు
చున్॥ ౨౦

సీ॥ పరమపావనమైన బ్రహ్మవంశంబునఁ
ప్రభవించి సర్వశాస్త్రముల నేర్చి
స్నానసంధ్యాద్యనుష్ఠానతత్పరుఁడనై
యార్జవంబునకుదాహరణమగుచు
సార్వభౌమునియొద్ద సన్మానములనంది
ధీరశాంతుఁడనన్న పేరుఁగాంచి
వరసనాతనధర్మ పక్షపాతినటంచు
నార్యసన్నుతుఁడనై యశముఁబొంది

ఉ॥ ఎందఱుసుందరీమణుల నీమహిఁజూడము వారి యందు నీ
చందముఁ బోయగంబు సరసత్వముజాణతనంబులున్న వే?
యిందుశిలావిధంబున మదీయమనంబలినీలవేణి పూ
ర్ణేందుముఖిద్యుతిన్ గఱఁగె నేమి యనంగలనింక నద్దిరా!॥

కం॥ దురితంబౌఁ బరభామల
సురతంబను ధర్మశాస్త్రసూక్తి యెటున్నన్
ధర వారకాంతఁ గూడుట
పరభామారతమటంచుఁ బలుకం డను నే॥ ౨౮

ఉ॥ కష్టము లెంచకుండ జపహోమములన్ దిండికిమాని నిష్ఠతో
నిష్ఠి యొనర్చి వేదముల నెప్పుడుఁ దప్పక వల్లెవేయుచున్
శిష్టులమంచు వీఁగెదు వశిప్రవరుల్ వివశాత్ములౌచుఁ ద్రి
విష్టప భోగకామినుల వెంబడి లోఁబడి సంచలింపరే? ౨౯

మ॥ వనితారత్నము రూపనైపుణులఁ దా వర్ణించి భావించి త
త్ప్రణయోద్యోతితచిత్తుఁడై తపులఁగా వాంఛించు నాలోన నే
జననిందా భయరూపమౌ పెనుపిశాచంబడ్డమైనిల్వ నా
ఘనుడార్యుండయి సెజ్జపైఁ బొరలుఁ గింకర్తవ్యతామూఢుఁడై

కం॥ తులసీదాసివ్విధమున
వెలవెలఁదినిఁ గూడుటకును వీడుటకైనన్
వలనింత లేక చింతా
జలనిధిమునుఁగంగఁ జూచి సాధ్వసమొలయన్॥ ౩౧

ఉ॥ ఆతనిజాయ యంతట రయంబునఁ జేరఁగ వచ్చి నిల్చి యే
మీ! తడవాయె లేచి, భుజియింపఁగ రాఁగఁదె యెన్నఁడిట్టి చిం
తాతిశయంబు నీయెడలఁ జక్కటకానఁగ రాదు నాథ! నీ
యీ తెలివెల్లఁ జూడ మదినెంతయు శోకము సందడిల్లెడున్॥

కం॥ ఆరోగ్యమొసఁగ నీకు వి
చారంబిది యేల మామ సౌఖ్యంబున్నే
దూరంబేగిరి వారలు
సేరుటకిఁక నెంతతడవు సేయఁ దపోకదా? ౩౬

చం॥ స్థిరమగు కూర్మి రాఘవపదేష్టంబోలిక రాజు నీవు నే
యరమరలేక సర్వజనపక్షంబుల నాదరించుచుందు రాధరా
వరుఁడెటు యేకతంబునన జనాదరసర్వుఁడుగా! వసుంధరా
మరులకు నెంతవారు నవమానము సేసినఁ జెంపుఁగాంతురే!

సీ॥ సద్వంశమునఁ బేర్మిఁ జన్మించి తలిదండ్రు
లల్లారుముద్దుగా నరయఁ బెరిఁగి
సర్వశాస్త్రంబుల శ్రమలేకమై నేర్చి
సార్వభౌముని ముఖ్యసచివుఁడగుచు
సౌందర్యలావణ్య చాతుర్యములనివాచు
సర్వదిక్కుల యశస్సంబు పర్వఁ
బాడిపంటలతోడఁ బైడిమాసులు ద్రవ్వి
తండంబులైయుండఁ దనరుచుండ
గీ॥ నెందు నొక్కింత లోటు లేదనఁగ నీకుఁ
జిత్తమందిట్టి గాటపుతావింతె గూడు
టరయ రవియందు దట్టమౌ సిటు బలియు
నట్లు తోఁచెఁగద మనోహరా! తలంప॥ ౩౮

చం॥ అరయమిఁ జేసి నే సఖినయంబొనరింపఁ ద్వదీయచిత్తమా
నరుసనుక్షోభమందెడునె ప్రాణపతీ! భవదీయదాసి నె
ప్పరుసున శిక్షసేయుటది భావ్యమొ యట్టులు చేయ కివ్విధిం
బురపురఁ బొక్కుచుంట యిది పోలునె నన్గరుణించి కావవే॥

గీ॥ యుక్తమని నీకుఁ దోఁచిన యోజ నెట్టి
కఠినశిక్షలకైనోర్వఁగలనుగాని
తమముపైఁబడఁ దేజంబు తఱుఁగు చంద్రు
ననుకరించిన నీమోముఁ గనఁగఁజాల॥ ౩౬

గీ॥ మచ్చలేనట్టిచందురు మాడ్కి వెలయు
నీదు సమ్మోము రుచి శోకనీరదములఁ
బిహితమైపోవ నానాథ! విశ్వమెల్లఁ
గాఱుచీకట్లు గ్రమ్మిన కరణిఁదోఁచు॥ ౩౭

గీ॥ మాఱుపలుకవు నాథ! వేమాఱు నిన్నుఁ
బలుకరించిన నిఁక యేమికలఁత యొక్క
మాఱు మోమిటు నా మోము నోరగంట
నేనియొకమాఱుఁ జూడవే నేమియందు॥ ౩౮

ఉ॥ భ్రాంతియెకాని కల్గదు త్రివర్గసుఖంబుల శాంతి యంచు నీ
స్వాంతమునందు నెంచి యపవర్గ నిసర్గశిమార్గ మార్గణ
క్రాంతినిలోకమంద రతిఁగాంచితివే హృదయాధినాథ! యా
వంతయు నీమనంబు తెలియ నాకగుఁ రాదిఁక నేమిసేయుదున్॥

చ॥ మమతఁ బరిత్యజించి యపమానము మానము నాత్మలోపలన్
సమత గణించి ప్రాప్తమగు సౌఖ్యతతిన్ భుజియించి నిర్వికా
రమునఁ జరించి, నేన నగరాజకుమారి ప్రియుండనంచు శాం
తిమఁగ క్షమింపరాదె యిటు దైన్యముఁ బొందమనీషకల్మియే

చ॥ తనువిడనాడి వారవనితామణిఁ గూడుమటంచుఁ జెప్పరీ
తినినిజభార్యఁ దాఁ బలుకుతీరు చెవింబడ దద్దఱిల్లి, యే

చం॥ అనితలఁబోసి నాథునిపదాబ్జములల్లన నూరుసీమపైఁ
గొని, వనితాలలామనిజ కోమల పాణులఁబట్టియొత్తుచున్
మనమునఁ బొంగుశోకమణు మాత్రముఁ బైకిఁబుకంగనీక చ
ల్లనిలలితోపచారముల లాలనసేయుచు భర్తకిట్లనున్॥ ౪౮

చం॥ మనముననేమిచింత యిదిమన్మథమన్మథ! పుణ్యరాశియౌ
వనితయెవర్తె రేనినిజభక్తిసుశీల సురూపసంపదన్
మనమునాహరింప నీకిటులు మన్మథమార్గణపుంఖసంహతుల్
జనుపడునొక్కొ నిన్ను వలవంతఁగలంచెడు కాంతలుందురే॥

మ॥ నిను మెప్పించి మనంబుఁజూఱకొనునా నీరేజపత్రాక్షి వి
న్నను వృన్వర్ణన సేయఁగాఁదరమొకో నాథా! తగన్ నీదుమ
న్ననకర్హంబగునట్టిపుణ్యసతి యెన్నన్ నాకునుంబూజ్యయౌ
ననుమానంబిఁక నేలనోయనఘ! యయ్యబ్జాక్షి రప్పింపుమీ॥

గీ॥ పుణ్యగరిమనుచంద్రులావణ్యసుధను
దానెక్రోలిచకోరి యుద్ధతినవహింపఁ
బగవహించునె? తొగకన్నెపంకజారిఁ
గనులఁగాంచిన మాత్రనేకనదెముదము॥ ౫౧

గీ॥ దేవఁదవులకయినఁదు దాసీనుఁడగుచుఁ
గరము మెఱయఁగఁ దత్కరగ్రహణభాగ్య
గరిమ మోదింతుపద్మినీకాంతలెల్ల
దక్షుఁడౌటఁ దప్పెదక్షుఁకిల॥ ౫౨

చ॥ అనుచుఁబతివ్రతాతిలకమా సతి యీగతిఁజాలసేవ దా
న నునయవాక్యసంతతులనాతనిఁ దేర్పఁగ నేర్పుసూపినన్
జనపతివాడఖీతిమది సంధిసేయఁగలంకఁ దేనిదా
జననుతుఁడార్తుఁడౌటఁగని సర్వముఁ దెల్పెఁదదంబకంతటన్॥

కం॥ తల్లియు నుల్లములోపలఁ
దల్లడపడియపుడు వేగఁదనయునెదరికిన్
మెల్లమఁ ప్రీతిమైఁజని
సల్లలితాలాపములను సాంత్వనమొనరన్॥ ౫౪

గీ॥ ఎంతచెప్పిన నాతఁడొక్కింతయేని
చింతవీడక కన్నమ్మ పంతగింప
నమలి యుమియుచు నేఱుచు నలిపి నలిపి
మెతుకులొకకొన్ని యెట్లెట్లొ మెసవె విసివి॥ ౫౫

కం॥ నగరాజకుమారీమణి
నిగనిగలను మంత్రివరుని నేత్రద్వయమున్
మిగులఁగ మిఱుమిట్లుగొని
జగమింతయుఁ గానరాక జాలింబడియెన్॥ ౫౬

ఉ॥ అంగజరాజ్యలక్ష్మియగు నాగణికాగణనీయ చారుప్ర
త్యంగముఁ జిత్తమందున మహాకుతుకంబున నెంచినిల్పి త
త్సంగతిఁగోరి పూజనముసల్పి తదేక నిరీక్షదీక్షమై
నింగియునేలయుంగనఁడు నిస్పృహఁజెందినయోగికైవడిన్

ఉ॥ కాసునకాసఁజేసి తనకాయము నద్దెలకిచ్చు వారకాం
తాసహవాసమే, తులసిదాసుఁడుభాగ్యమటంచు నెంచియా
యాసముఁజెంది దానివయినాసఁద్యజింపఁగ లేకలోకమున్
రోసి కృశించె నత్తరి ననూనమనోజ శిలీముఖవ్యథన్॥ ౫౮

గీ॥ హాళిమీఱఁగ వెలయాలి కేళిఁగోరి
యాలిరోసెను రాచకార్యాళిరోసె
లోకపరివాదభీతిఁ జీకాకుపడుచుఁ
దాపమొందుచు నున్నట్టికన్నరోసె॥ ౫౯

ఉ॥ స్వోదరపూరణార్థమయి సోదరభావముఁ జాటిసన్నిధిన్
బాసికొనంగ నిచ్చకపుమాటలు పల్కుచుఁ జిత్తమందుఁ బే
రాదట పొంగిపొర్లి నటులాదరము ప్రకటించు వారి మ
ర్యాదలు వెక్కసంబయి కుటుంబము నీ స్విలువంగ నంపితేన్॥

గీ॥ నీకు స్వస్థత లేకుంట నాకయుంటి
వనుచుఁ దెలిసిన నేస్త మిటుగ నగపత్తుఁ
గాక పిలిపింతునే రాజ్యగర్వమునను
పోయి సుఖమున రమ్మంచు భూభుజుండు॥ ౬౫

గీ॥ తులసిదాసున కీరీతి సెలవిడిరాజు
సెలవొసంగిన మరుపూట పలాత కతఁడు
పరిజనంబుల సరకుకి పాదచారి
యగుచు రయమున సభనుండి యరిగెనంత॥ ౬౬

గీ॥ కర్ణధారుఁడు లేనట్టి కలముపగిది
త్రాడుపీడినఁ దట తటలాడు గాలి
పడగ వడువున నిలుకడఁ బడయక వెర
వేఁకి వీథులఁ దిరిగె వివేకమేది ౬౭

గీ॥ ఇంటికేగంగ మనమున నిచ్చలేదు
ఇచ్చవచ్చిన యెడకేగ ధృతియు లేదు
ఎచటికేగుచునుంటినన్ స్మృతియు లేదు
ఆటకత్తియ పైఁగల యాసఁ జేసి॥ ౬౮

ఉ॥ పాటలగంధిమున్ సభను బాడినపాటలు నాడుమాటలున్
నేటికి వాని చిత్తమున నెక్కొని మాటికిమాటికి మ్రోగ శృం
గాటక మందు, నాపతి మక్కై వడి సిగ్గిడి యట్టె నిల్చి మా
ర్గాటనముఁ బల్కకుండుఁ బవిమానితనుం బడఁద్రోసి యోగినన్॥

